శ్రీ

కృష్ణాయ

రంగదశశ్లోకియను పరమేశ్వర దశశ్లోకియను

నామంబులిడి ఈస్తవరాజము.

శ్రీమద్బొబ్బిలి సంస్థానస్థిత సంస్కృతపాఠ

శాలా పండితులగు

న్యాసావజ్ఝల సూర్యనారాయణ శాస్త్రిచే

రచింపబడి బొబ్బిలిహైస్కూలు సంస్కృతపండి

తులగు మండపాక లక్ష్మీనారాయణశాస్త్రిచే

వ్రాయబడిన తెనుగు టీకాతాత్పర్యములతో

జేర్చి తత్పురవాస్తవ్యులగు

మహారాజశ్రీ శ్రీ

రావువేంకటవేణుగోపాల పట్టాభిరాయునింగారి

ద్రవ్యసహాయ్యమున

వినాయకస్తవం

వినాయకమహంవందే విఘ్నాద్రిభిదురంపరం।

బాలేందు శేఖరోద్భాసి ఫాలభాగవిరాజితం॥

గురుస్తవం

శీతారామవిపశ్చిదం బరమణేః పద్యోతపాద

స్మృశాంశిష్యాణాం హృదయాబ్జశోశవినరో వి

త్యం వికాసాధికః॥ తత్పాదైస్త్రరణార్ద్రిసేబ్జ ముకు
ళాన్యుత్ఫుల్ల తాం యాంత్యహో రాత్రి చ
న్మకులీభవంతి సుమనోవారార్చితం తం భజే॥
శ్రీమద్రావుకులాబ్ధిశీతకిరణం। చంచత్కళాభా
సురం। శ్రీశైశాంఘ్రిసరోజసక్త హృదయం। రె
చర్లగోత్రోద్భవం। పిత్రోః ప్రీతికరం సహోదర
హితం। విద్వన్మనోభీష్టదం। గోపాలప్రభువర్య
మార్యవిసుత[illegible] పాయాత్సదామాధవః॥

రావువంశసుధాంభోధిపూర్ణిమాశీతరోచిషః।
గోపాల ప్రభువర్యస్య శ్రియం దద్యాచ్ఛ్రియః
పతిః॥



శ్రీరామాయనమః.

# ఉపోద్ఘాతము.

అయ్యలారా! నేనప్పుడప్పుడు వినోదార్థమై శివపరంబులును విష్ణుపరంబులునునగు గొన్ని శ్లోకములు జేసియుంటిని ప్రసంగవశంబున నేనీ శ్లోకములజదివి యుపన్యసించుచుండ కేచర్లగోత్రోద్భవులును రామకులజలధి సుధాకరులును దేవద్విజసమారాధనాసక్తమానసులును ఆమేరుశీతనగరమధ్యవర్తి నిఖిలపుణ్యక్షేత్ర తీర్థపర్యటన పరిపూతులును ఆశ్రితజనవత్సలుగును నిరుపమమేధా యశోబలయుతులును నగు శ్రీ వేంకయ్య ప్రభువరేణ్యునికి ప్రభుమంత్రోత్సాహములవలె నుదయించిన బుచ్చివేంకటరావుగారు వేంకటశోభనాద్రి సూర్యారావుగారు వేంకట వేణుగోపాలపట్టాభిరామారావుగారు నను మువ్వురిలో దృతీయులును పితృసమాన యశోగుణులును ప్రభుసన్మానితులును నగు గోపాలరాయనింగా రత్యాదరమున నాలించి విష్ణుపరంబగు శ్లోకంబులు టీకాతాత్పర్యములతో జే

ర్చి మీరివ్వవలెను అచ్చొత్తించుటకు మిక్కిలి యుత్సాహముగలదని నన్ను బ్రేరేపింప కవన మంత రసవంతముగా నుండకున్నను భగవద్వి షయకంబగుటంజేసి చదువరులకు రుచింపకపోద నినమ్మి విష్ణుపరమగు రంగదశశ్లోకియనియు పరమే శ్వరదశశ్లోకియనియును నామంబులిడిన ఈస్తవ రాజములను తెలుగు టీకాతాత్పర్యములతో జేర్చి వారికిచ్చితిని నాగ్రంథము శాశ్వతమగున ట్టుల వ్యయప్రయాసములకోర్చి ముద్రించిన న మ్మహానుభావునికి కృతినాయకుండగు భగవం తుండు నిరంతరము సకలాభీష్టములు నొసంగు గాత మరియు నిందుసాధ్యమైనంతమట్టుకు త ప్పులులేకుండా సవరించితిని మరియు బట్టువడని తప్పులనుసవరించుకొనుభారము చదువరులయం దే యుంచినందుకు క్షమింపవేడుచున్నాను.

"వైకుంఠశిఖరిణ్ణీ పంచదశ" అనుస్తవరాజము ను యిదివరకు అచ్చువత్తించితిమి వేంకటేశ్వ రాష్టకస్తవరాజమును అచ్చువత్తించుటకు ని శ్చయించియున్నారము,

ఇట్లుసజ్జనవిధేయుడు,

న్యాసావఝ్ఝుల సూర్యనారాయణశాస్త్రి.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# హరిహర స్తవరాజము

శ్లో॥ ఇందిరాహృదయ సారసభృంగః
కుండలీంద్రమృదుతల్పశయానః
పాదపంకజ సముద్ధితగంగః
పాతునః పతగరాజతురంగః॥ ౧

అర్థము. ఇందిరాహృదయ సారసభృంగః। ఇంది।లక్ష్మీదేవియొక్క హృదయ।డెందమను సారసః।పద్మమునకు భృంగః।తుమ్మెదయు (బంభరం బెటులవికచకమలంబునధివసించి మకరందమును గ్రోలుచు (రసవశంబునమైమరచి కదలకయు చటనేయుండునో యట్లనే వికసితమగు నీమె డెందమునవధిసించి ప్రేమరంజనను అనుభవించుచు యున్నటికి విడువక యామెహృద్గోడనౌ యుండెనని భావము)

కుండలీంద్రమృదుతల్పశయాంగః కుండలీంద్ర। అనంతుడనెడు మృదుతల్ప। మెత్తనిపరుపుపై శయ।పరుండెడు అంగః। దేహముగలవాడును (భగవంతుండు ఆషాఢాదినాల్గుమాసంబులలోనసముద్రమధ్యంబున శేషునిశయ్యగాకొని అతనిపడగలపై తనమస్తకంబునిచి నిద్రించుననూ పురాణగాథసూచించబడినది) పాదపంకజ సముద్ధితగంగః పాదపంకజ।పద్మమువలె శోభాతిశయముచే నొప్పు పాదములనుండి సముద్ధిత।ఉత్పన్నమైన గంగః।గంగానదిగలవాడను (సర్వలోకపావనియగు గంగానది భగీరథతపఃఫలంబై ఈతనిపాదముసందుద్భవించునటుల గాథగలదు)పతగరాజతురంగః। పతగరాజ।పక్షులకురాజగుగరుత్మంతుడు తురంగః।వాహనముగాగలభగవంతుడు నః।మనలనుపా।తురక్షింతుగాత (లోకానుగ్రహతత్పరుడై తనపాదంబున గంగనవతరింపజేసిన శేషశాయియు, గరుడవాహనుండును, లక్ష్మీమనోవల్లభుండునునగు, భగవంతుండు మనలనెల్లరను సర్వసుఖంబులనొసంగి గాచుగాతయనితాత్పర్యం.

శ్లో॥ శోణహస్తతలశోభిరథాంగః
ఖండితాఖల నిశాటతరంగః

నీలనీరదవిజేతృ శుభాంగః
పాతునః పతగరాజతురంగః॥ ౨

అ॥ శోణహస్తతలశోభిరథాంగః శోణ।యు రసగు హస్తతల।అరచేతిలో శోభి।ఆయుధము గాను, అస్త్రముదగానున్న, ప్రకాశించెడు, రథాంగః।ఛత్రముగలవాడును (విభుత్వసూచక మగు ఛత్రచిహ్నము ను తనయాయుధంజగుసు దర్శనంబును చక్రంబునుదాల్చువాడనిభావము) ఖండితాఖలనిశాటతరంగః ఖండిత।తుత్తునియ లుగానొనర్పబడిన అఖల।సమస్తమగు నిశాటత రగః।ప్రవాహములుండెడుయలలువలెనపారము లును భీకరులునునగు నిశాచరులుగలవారును, (సర్వసమర్థుండగు డీభగవంతుండు భూతదయా ళుడై యవతరించి జగత్కంటకులై మహోపద్ర వములను గలిగించెడిమితిలేని నిశాచరవీరులను ఖండించి జగంబును కాపాడుచున్నాడని భావం) నీలనీరదవిజేతృశుభాంగః నీల।నల్లని నీరద।మే ఘమును విజేతృ।జయించెడి శుభాంగః।శుభప్ర దమగుశరీరముగలవాడునునగు పతగరాజతురం గః।పక్షిరాజగుగరుడుడు వాహనముగాగలవిష్ణు మూర్తిః నః।మమ్ము పాతు।రక్షించుగాత (విభు

త్యనూదిక బగు సాధురక్షణార్థమై శంఖచక్రాది దివ్యాయుధంబుల కరపల్లవములందాల్చి దుష్టరాక్షస నిగ్రహణంబును చేయ కృష్ణరూపమున నవతరించిన గరుడవాహనుండు మనలనెల్లరను సర్వదా రక్షించుగాతయని తాత్పర్యం).

శ్లో॥ కంఠదామసుమమధ్వనుషంగః
శత్రుసాత్కృతతరేవ్యభిషంగః
ఖండితత్రిదశవైరిదృఢాంగః
పాతునఃపతగరాజతురంగః॥ 3

అ॥ కంఠదామసుమమధ్వనుషంగః కంఠ।తన కంఠదేశంబునదాల్చబడిన దామ।పూలహారము నందుండు సుమ।పుష్పములయందలి మధు।పూదేని యయొక్క అనుషంగః।సంబంధముగలవాఁడును (దివ్యమంగళ విగ్రహుండగు నారాయణుండు విలాసముగా దేవతరుకుసుమములచే నిర్మింపబడిన వనమాలను తనకంఠదేశంబునదాల్చ మ్లానత్వాదిదోషరహితంబులగు నాసుమంబులనుండి మిక్కుటముగ బూదేనియ యాతనివక్షంబున శోభించుచున్నదనిభావము). శత్రుసాత్కృతపరేవ్యభిషంగః శత్రుసాత్కృత।తనశత్రువుల కొసంగబడిన పరేషు।వరంబులయందు అభిషంగః।

పట్టుదలగలవాడును (శత్రువులకయు నానావరంబు లనిచ్చి పద్గతినొందించుటయందె పట్టుదలవహించి వారివారి వాంఛానుసారంబగు ఫలంబుల నొసంగువాడనభావము). ఖండితత్రిదశ వైరిదృఢాంగః ఖండిత। తుత్తునియలుగానొనర్పబడిన త్రిదశ వైరి। విబుధవిద్వేషులగు రాక్షసులయొక్క దృఢ। మిక్కిలిబలముగలిగికొవ్వియున్న, అంగః। అవయవములుగలవాడును, పతగరాజతురంగః। పక్షివాహనుండగు శ్రీమన్నారాయణుడు, నః। మమ్ము, పాతు। రక్షించెడుగాత,( మహావిలాసశేఖరుండై వనమాలం దాల్చి శత్రువులకయినను ఇచ్ఛానురూపంబగు వరంబులనొసంగుచు మహాత్ముల బాధలపెట్టు దుర్జనులరూపుమాపెడి నారాయణుండు మనలరక్షించెడుగాతయని తాత్పర్యము). శత్రుశాత్కృత। శత్రువులకొనగూర్పబడిన, వరమంచిసారవత్తరమైన ఇషుబాణముల చేతనైన, అభిమంగః। పరాభవముగలవాడు, ఎంతబలవంతులగు శత్రువులైనను సారవత్తరముగునటయాయుధముల సాహాయ్యముచే మోడించు వాడనియు అర్థము తీసుకొనవచ్చును.

శ్లో॥ మౌనిమానస గృహాంతరసంగః
చండశస్త్రి పరిపూర్ణనిషంగః
గోపికావన విహారకురంగః
పాతునః పతగరాజతురంగః॥ ౪

అ॥ మానమానస గృహాంతరసంగః, మౌని। తమతమ, (తపఃప్రభావముచే అతీంద్రియము గు నిగమాంతగమ్యంబగు పరబ్రహ్మతత్వమును గ్రహించెడు మహామునులయొక్క మానసహృదయము నెడు), గృహ।సుఖావాసయోగ్యమగు, నింటియొక్క, అంతర।లోపుభాగమున, సంగః। సంబంధముగలవాడును, (పరాత్పరుడు సర్వవ్యాపకుండయినను రాగద్వేషాది దోషసూన్యమై పరమపూతంబై మునులయొక్కహృదయము నిర్మలమగు సౌధమువలె సుఖావహమైయుండుట చే వాటినివిడిచియుండుట కిచ్ఛగించనటుల నత్యుత్సాహముతో నచటవతిల్లునని భావము). చండశస్త్రిపరిపూర్ణ నిషంగః, చండ।వాడియగు, శస్త్రి।ఆయుధములచే, పరిపూర్ణ।నిండియున్న, నిషంగః।అమ్ములుపొదిగలవాడును, (దుష్టదమనార్థమై యెల్లపుడును తనయమ్ములపొదియందు వాడియైనబాణంబులుదాల్చి జాగరూకుడై

యున్నాడనిభావము). గోపికావన విహారకురం
గః. గోపికా।గోపికలనియెడు, వన।యరణ్యంబు
న, విహార।విహరించెడు, కురంగః।లేడియు, (గో
పికావల్లభుండును నంశమునుసూచించుటకై అ
రణ్యమువలె దురవగాహంబును మిక్కుటమును
నగు గోపికాబృందమధ్యంబున దుప్పివలె విహ
రించునటుల నత్యుత్సాహము తో విహారమొనరం
దుచున్నటుల చెప్పబడినది) పతగరాజతురంగః
గరుడవాహనుండగు విష్ణుమూర్తి, నః।మమ్ము,
పాతు।రక్షించుతుగాక, (దుష్టశిక్షణ దక్షుండును
సాధుసంతర్పకుండును గోపికావల్లభుండును మ
మ్మురక్షించుగాతయని తాత్పర్యం).

శ్లో॥ దివ్యసన్నుత సువృత్తదనంగః
పాదమర్దిత నిరుద్ధభుజంగః
భక్తకామదవి నిర్యదపాంగః
పాతునః పతగరాజతురంగః॥ ౫

అ॥ దివ్యసన్నుత సువృత్తదనంగః, దివ్యస్వర్గం
బున నివసించెడి దేవాదులచే, సన్నుత।కొనియా
డబడును, సువృత్త।మంచిగుణవంతుడగు కు
మారునివలెవర్తించెడు, అనంగః।మన్మధుడుగ
లవాడును, (పూర్వముమన్మధుడు తారకాసుర

సంహారణంబున ముఖ్యసహాయుడగుటచే దేవతు లశ్లాఘాపాత్రుడయి ఈశ్వరఫాలాగ్ని దగ్ధుడయి అనంగుడయ్యెను మరల భవాన్యనురోధంబున విష్ణునివల్ల ప్రద్యుమ్నుడై యవతరించెనను గాథసూచించబడెను) పాదమర్దిత నిగృహీత భుజంగః, పాద।తనపాదములచే, మర్దిత। మర్దన చేయబడి, నిగృహీత।దుష్టకార్యములనుండియడ్డబడి నభుజంగః।కాళీయసర్పముగలవాడు, (కాళీయ సర్పము యమునానదీతీరంబున నసించి యచటికేతెంచువారల కవార్యంబై హింసించుచుండ సర్వేశ్వరుడగు భగవంతు డచ్చోటకేతెంచి తన పాదములచే దానినితొక్కగా నాబాధకోర్వలేక మొరలిడ సామొరలాలించి నాగకన్యకలు భగవతు నభ్యర్థనముచేయ పరిసన్నుడై యంత శోవిరమించెనను పురాణగాథసూచింపబడినది. భక్తకామదవి నిర్యదపాంగః, భక్త।భక్తులయొక్క, కామద।కోరికలనిచ్చునదై, వినిర్యత్।బయలుదేరెడు, అపాంగః।కటాక్షముగలవాడు, అనగా తనకటాక్షపాతంబున పాత్రుడగువాడు సర్వాభీష్టములనొందియుండునని భావము).

ఖగరాజతురంగః।గరుడవాహనుడు మనల ర

క్షించుగాత). ప్రద్యుమ్నజనకుండును కాళీయ మర్దనుఁడును భక్తాభీష్టప్రదుండును భగవంతుం డు మమ్మురక్షించెడుగాత.

శ్లో॥ కల్పితాఖల జగత్థ్సపడంగః
కామకోటి తులితాకృతితురంగః
కంఠనాదజితి శంఖమృదంగ,
పాతునఃపతిగ రాజతురంగః॥ ౬

అ॥ కల్పితాఖల జగత్ స్థషడంగః, కల్పి। విధి నిర్మితమైన, అఖల। చరాచరాత్మకమగు సమస్త మైన జగత్ ప్రపంచమునందు, స్థ। సర్వవ్యాప కుండగుటచే వ్యాప్తమైయున్న, షడంగః।జం ఘాద్వయము (బాహుద్వితియము శిరస్సు మ ధ్యంబుననియెడి యారవయవములుకలవాడును కల్పించబడిన సమస్తజగత్తియందును వ్యాపింప చేయబడిన శిక్షావ్యాకరణాది రూపంబగు వే దాంతములు గలవాడుసు ననియర్థము). కామ కోటితులితాకృతితురంగః, కామకోటి। కోటిమ న్మధులతో, తులిత।సమానమగు, అకృతి।సౌంద ర్యంగలిగియుండుటచే, తురంగః।గొప్పవాడను. నిరుపమ।సౌందర్యశాలియని భావము, కంఠనా దజితశంఖమృదంగః, కంఠనాద।కంఠముచేతను,

నాద। కంఠధ్వనిచేతను, జిత।జయింపబడిన, శంఖ।శంఖమును, మృదంగః।మృదంగమను వాద్యవిశేషముసుగలవాడును, (కంఠ శంఖమువలె రమ్యముగానున్నదనియు కంఠధ్వని మృదంగధ్వనివలె నతిగంభీరముగానున్నదనియు భావము).

పతగరాజతురంగః। గరుడవాహనుండగు నారాయణుడు మమ్ముగాచుగాతయని సర్వావయవసర్వవ్యాపకుండును గంభీర కంఠనాదుండునునగు భగవంతుండు మమ్ము బ్రోచెడు గాతయని తాత్పర్యము.

శ్లో॥ రాధికానదన పద్మపతంగః
పాటితప్రతి భటాతులశృంగః
రత్నకీలిత కిరీటవరాంగః
పాతునః పతగరాజతురంగః॥ ౮

అ॥ రాధికావదనపద్మపతంగః, రాధికా। రాధయొక్క, వదనపద్మ।ముఖపద్మమునకు, పతంగః।సూర్యుడును, (సూర్యుడుదయించిన వెంటనే అతని తేజస్సంపర్కమాత్రమున పద్మంబు లెటులవికాశమునొందునో యటులనే యాతండింద్రియగోచరుండైనంతనె రాధికాముఖము ఉత్సాహాదిరేకమును సూచించుచు వికసించునని

భావము). పాటితప్రభటాతులశౌర్యంగః, పాటిత సమూలముగా, (మరలనుదయించుట కవకాశ ముచిక్కనటుల పెకలింపబడిన) ప్రతిభట।అ జ్ఞానముచే తన్నెదుర్కొనియెడి శత్రువులయొ క్క, అతుల।నిరపమానములైన, శౌర్యంగః।గర్వ ముగలవాడు, (యాతనిమహాత్మ్యము లెఱుంగక తెలివితక్కువచే మహావీరులమని గర్వించిహుం కరించుచు నీతనినెదరించెడు మూఢులను నవలీ ల నీమహావీరుండు ఛీకొనిపీచమడంచి పాదా క్రాంతులునుగా నొనర్చుచున్నాడని భావము). రత్నకీలితకిరీటవరాంగః, రత్న।రత్నములచే, కీలి త।తాపింపబడిన, కిరీట।కిరీటము గల, వరాంగః। సర్వగాత్రప్రధానంబగు నుత్తమాంగంబని వ్యవ హారింపబడుచున్న శిరంబుగల, పతగరాజతురం గః।పక్షివాహనుడు, నః।మమ్ము, పాతు।రక్షించు గాత।(రాధికామనోవల్లభుండును శత్రుదమనుం డునుకిరీటయనదగు పక్షివాహనుడు మమ్ముబ్రో చుగాతయనితాత్పర్యము).

౩. అగమాంత తరుశాఖవిహంగః
సర్వమంగళ గుణోత్కరంగః

శుక్రశిష్య భయకృద్రణరంగః
పాతునః పతగరాజతురంగః॥

అ॥ ఆగమాంతతరు శాఖవిహంగః, ఆగమాంత।ఋగ్యజుస్సామాథర్వణంబులనునాల్గువేదంబుల తుదభాగంబులగు నుపనిషత్తులనియెడు తరుశాఖ।చెట్లకొమ్మలపైనిసంచరించెడు, విహంగః। పక్షియయినవాడును, సర్వమంగళ గుణోత్కరరంగః, సర్వ।సమస్తమైన, మంగళగుణోత్కర।కళ్యాణగుణసమూహమునకు, రంగః।నాట్యస్థానమైయున్న వాడు, (అసద్గుణాకరుండగుటచే యాయానుగుణము లెల్ల యీమహానుభావునివద్ద తగుకుగలసుఖసంవాసమును లోకులకు వెల్లడియగునటుల నాట్యమొనరించుచున్నవని భావము). శుక్రశిష్యభయకృద్రణరంగః, శుక్రశిష్య।శుక్రాచార్యుని శిష్యులగు రాక్షసులకు. భయకృత్।భయంబుకలిగించు, రణరంగః।యుద్ధవీరుండునుఅగు, పతగరాజతురంగః।పక్షివాహనుండగు నాదివిష్ణుడు, నః।మనలను, పాతు। రక్షించుగాత, (దుష్టదమనుండును సకలగుణగణవాహినుండును నయ్యు కేవలోపనిషదవగమ్యుండగు నాదివిష్ణుడు సకలసుఖంబులనొసంగి

మనలగాచుగాతయని తాత్పర్యము). బ్రహ్మప్ద దార్థము సర్వోపనిషదభిధేయంబగుటచేత ప్రతిపాదకంబగు నుపనిషత్తులను తరుశాఖలతోను పరబ్రహ్మము శాఖలయందు విహరించెడి విహంగముతోను సర్వోపనిషత్ప్రధానములగు వేదములు ప్రధానమగు వృక్షముతోను సరిపోల్పబడినవి ఉపనిషత్తులన్నియు నేకగ్రీవముగా నీ మహానుభావుని గుణస్వరూపములనే బోధించుచున్న వని భావము.

శ్లో॥ ధీరమానస సరోజపతంగః
చ్రివ్యవాహిత మహాభ్తమహాంగః
చంక్రిఖండిత సురారివిభంగః
పాతునః పతగరాజతురంగః॥౯

అ॥ ధీరమానససరోజపతంగః, ధీర।సదసద్వివేచవపరులగు పండితులయొక్క। మానస।హృదయమనెడు, సరోజ।పద్మములకు, పతంగః.సూర్యుడును, (సూర్యుడుతనకిరణప్రసారముచే ముకుళీకృతమగు పద్మమునవికసింపజేసి తదియపరిమళమును దిఙ్ముఖములనెట్లు ప్రసరింపజేయునో యటులనే పండితులడెందముల యజ్ఞానతజస్సంవృతిని పోగొట్టు బుద్ధివికాశమున జ్ఞానతేజస్సు

ను వృద్ధినొందించి యపరిమితానందమును గలుగఁజేయువాఁడని భావము). దర్ప్యవాహితమహోక్షమహాంగః. దర్ప్యవాహిత। దర్ప్యమూస్థువహిం చునటుల జేయఁబడిన, మహోక్షా। పెద్దవృషభములును, మహాంగ। ఒంటెలును, (వృషభముల చేతను, ఒంటెలుచేతను. మోయించదగిన ధనసమృద్ధిగలవారిని గావించుచున్నారని భావము), చక్రిఖండిత సురారివిభంగః, చక్రి। సుదర్శనము తనఆయుధముచే, ఖండిత। ఖండింపబడిన, సురారి। రాక్షసులయొక్క, విభంగః। బలగర్వముగల పతగరాజతురంగః। గరుడ వాహనుండగు విష్ణుమూర్తి మమ్ముబ్రోచుగాత, వివేకవంతులగు పండితుల బుద్ధినివికసింపజేయువాఁడును సర్వసంపత్ప్రదుండును దుష్టసిక్షకుండును నగు నారాయణుఁడు మమ్ముబ్రోచుగాతయని తాత్పర్యము.

శ్లో॥ లోకరక్షణ విధానసలింగః
కాంచనాంబర విభాసిశుభాంగః
భక్తదత్తదళ పూగలవంగః
పాతునః పతగరాజతురంగః॥ ౧౦

అ॥ లోకరక్షణవిధానసలింగః, లోక। విధినిర్మితమగు ప్రపంచముయొక్క, రక్షణవిధాన।

అపాయము వాటిల్లకుండ రక్షించడమనుకార్య మునందు, సలింగః। కార్యముగలవాడును (తాను రక్షణనియుక్తుండగుటచే ప్రపంచరక్షణ రూప కార్యమునకు కారణమైయున్నవాడని తాత్ప ర్యము) కాంచనాంబర విభాసిశోభాంగః, కాం చన। సువర్ణమయమైన, అంబర। పట్టుబట్టలచే, వి భాసి। శోభిల్లెడి, శుభ। శుభప్రదమైన, అంగః। అ వయవములుంగలవాడును, భక్త దత్త దళపూగల వంగః, భక్త। తన్నుగొల్చెడిభక్తులచే, దత్త। యి య్యంపబడిన, దళ। నాగవల్లీదళములున్ను, లవం గః। లవంగములున్నుకలవాడు, (భక్తులుతమతమ పూజావసరములలో షోడశోపచారముల నర్పిం చునప్పుడు నాగవల్లీదళములపైని పూగీఫలలవంగ ములపైని యితరద్రవ్యములుగూడ సుచితాం బూలముల నర్పించుచున్నారనిభావం). పతగరా జతురంగః। పక్షివాహనుడు, నః। మమ్ము, పాతు। రక్షించెడిని, లోకరక్షణతత్పరుండును కాంచ నాంబరధరుండును భక్తసంసేవితుండును నగుభ గవంతుండు మమ్ముబ్రోచుగాతయని తాత్పర్యం.

॥ ప్రథమాష్టకము సంపూర్ణము ॥

---



రంగాష్టకమిదంపుణ్యం యఃపఠేత్సతతంనరః।
సకోటికులమద్ధృత్య సర్వాన్కామా నవా
ప్నుయాత్ ॥

ఈశ్వరస్తవరాజమునుఅచ్చుకొత్తించిన రావువేంకటవేణుగోపాల పట్టాభిరాయునింగారికి ఈకృతినాయకుండగు పరమేశ్వరుండు రక్షించుగాక.

## ఈశ్వరస్తవము.

### ద్వితీయాష్టకము,



వాసవప్రముఖాసురేంద్ర శిరఃకిరీటమణిప్రభా।
భాసితాంఘ్రిసరోరుహాంచితపాదపీఠవిభాసురం
పాదమూలసమర్పితాంజలిపుష్పవాసితదిఙ్ముఖం
పార్వతీహృదయాబ్జభాస్కరః మాశ్రయేపరమే
శ్వరం॥ ౧

అ॥ వాసవప్రముఖామరేంద్ర శిరఃకిరీట మ
ణిప్రభాభ్రాజితాంఘ్రి సరోరుహాంచితపాదపీఠ
విభాసురం, వాసవప్రముఖ। దేవేంద్రుడు మొద
లగు, అమరేంద్ర।జరామరణములు లేని దేవతా
శ్రేష్ఠులయొక్క, సిరః।సిరస్సుపైనున్న, కిరీట।కి
రీటములయందమర్చబడియున్న, మణి మరకత
వైఢూర్య గోమేధిక పుష్యరాగాది మహామణు
లయొక్క, ప్రభాశ్రేష్టమైన కాంతులచే, భ్రాజిత
ప్రకాశింపజేయబడిన, అంఘ్రిసరోరుహ।పద్మ
ములవలె ప్రకాశించుచున్న పాదములతో, అం
చిత।ఒప్పుచున్న, పాదపీఠ। పాదుకలచే, విభాసు
రం।ప్రకాశించుచున్నవాడు, (ఇంద్రుడు మొదల
గు దేవతలెల్లరు నిఖలమణిగణఖచితములగు కిరీ
టములను తమమస్తకంబులపైనిడికొని యాద్ర
తాణపరాయణుండగు నీయాదిదేవుని పాదుక
లపై తమకిరీటమణికాంతుల ప్రసరించునటుల
భక్తినమ్రులైతమతమసేవావశంబుల ప్రణమి
ల్లెదరని సూచింపబడెను), మరియు పాదమూల
సమర్పితాంజలిపుష్పవాసితదిఙ్ముఖం, పాదమూ
లసమర్పిత। పూజావసరములలో నిర్వ్యాజభక్తి
చే పాదమూలంబులనుంచబడిన అంజలి తమ

తము దోసిలులయందలి పుష్పపువ్వులచే, వాసి తపరిమళింపజేయబడిన, దిఙ్ముఖంబదశదిఙ్ముఖము లుగలవాడును, (పూజావసరములయందు దేవత లెల్లరు పారిజాతాదిదేవతరు కుసుమంబులగొని వచ్చి తమకరంబులుమొగిడ్చి యీశుని పా దంబులపైనిడ నాసుమంబులు పదిదిక్కులను త మవాసనలచే నిండునటుల జేయుచున్నవనిభావ ము). పారతీహృదయాబ్జభాస్కరం, పార్వతీప ర్వతరాజపుత్రియగు గౌరియొక్క, హృదయా బ్జసుకుమారంబగు హృదయంబనుపద్మమునకు, భాస్కరంసూర్యుడును సూర్యసాన్నిధ్యవశంబు న పంకజముల్లాసమునొందునటుల నీతనిసన్నిధని పార్వతీదేవిడెంద ముల్లాసమొందుచున్నదని భా వము. పరమేశ్వరంఅణిమాద్యష్టైశ్వర్య సంప న్నుడగుటచే పరమేశ్వరపదాభిధేయుడగు దేవుని ఆశ్రయేఐహికాముష్మికసుఖంబులుగోరి యాశ్రి యించుచున్నాను దేవతలెల్లరు పుష్పములగేల దాల్చి భక్తినమ్రులైయుండ వధూయుతుడైయు ల్లాసమందెడు శంకరునిసుఖమ్రైన గొలుచుచు న్నానని తాత్పర్యము.

కారణంజగతామనంతఫలప్రదంశుభకారిణాం।
అంబరాంబరమచ్యుతంభవసాగరైకవిశోషణం।
జాహ్నవీతటవాసిసజ్జనకర్ణముంత్రవిధాయకం।
పార్వతీహృదయాబ్జ భాస్కరమాశ్రయే పరమే
శ్వరం॥ ౨

అ॥ జగతాం।ప్రపంచములకెల్ల, కారణం।
ప్రధానకారణమైనవాడును, శుభకారిణాం।మంచి
పనులుచేయువారికి, అనంతఫలప్రదం, అనంత।
నాశములేని, ఫల।ఫలమును కైవల్యపదమును
ప్రదం।ఇచ్చువాడును, అంబరాంబరం, అంబర।
ఆకాశమె, అంబరం।కట్టుబట్టగాగలవాడు దిగంబ
రుడును, అచ్యుతం।యెన్నటికిని భంగములేనివా
డును, భవసాగరైకవిశోషణ, భవ।సంసారమనె
డు, సాగర।సంసారమునకు, (సంసారము కామా
దివికారసంకులమును సుఖదుఃఖసంమిశ్రమును
దురవబోధమును దుస్తరమునునగుటచే నక్ర
గ్రాహాదిజలజంతుయుతంబై దురవగాహంబును
దుస్తరమును తరంగమాలికాభీలంబును నగు స
ముద్రముగా రూపింపబడినది). ఏకవిశోషణం।శు
ష్కింపచేయుటలో ముఖ్యకారణమయినవాడు,
(ఈమహానుభావునిదయచే వానిగొలుచువారు

లెల్ల సంసారసాగరమును దాటగలరనిభావము).
జాహ్నవీతటవాసి సజ్జనకర్ణమంత్రి విధాయకం,
(జాహ్నవి।భగీరథుడు స్వపితామహులగు సగర
పుత్రులను సద్గతినొందింప తనతపఃప్రభావంబున
దేవానుగ్రహంబు బడసి తత్పాదోద్భవియగు
గంగను భూలోకమునకుదెచ్చుతరి నానది తాప
సోత్తముండగు జహ్నుమహర్షి యజ్ఞశాలంబ్రవే
శించి యజ్ఞకుండములముంప నాతండుగ్రుడై
దానినిపానముచేసెను పిదపభగీరథుడు దేవులను
ప్రార్థింప గొంతతడవునకు బ్రసన్నుడై యామహర్షి
తనకర్ణపథంబుఃవిడువ తిరుగప్రవహించు జాహ్న
వియను నామాంతరముచే నొప్పెడి గంగానది
యొక్క) తట॥తీరంబున (కాశీక్షేత్రమందు) వా
సినివసించెడు, సజ్జన।యోగ్యులయొక్క, కర్ణ। చె
వియందు, మంత్రి।తారకమంత్రమును విధాయ
కం।ప్రవేసించునటుల చేయువాడునునగు పరమే
శ్వరునాశ్రయించుచున్నాను, కాశీవాసియగు వి
శ్వేశ్వరుండు తనపురంబున కర్ణాహ్వాయనంబు
ను ధ్యేయంబునునగు తారకబ్రహ్మవిధేయంబ
గు మంత్రమును జీవునయవసానకాలంబు
న కర్ణపథంబున నుచ్చరించుచు విధువీధులతిగు

గుచుంచునని కాశీఖండ నందలియంశము సూచింపబడినది సర్వజగత్కారణమై, వారియోగక్షేమముల నరయుచు సంసారవిదూరులగునటుల భగవంతుని శాశ్వతసుఖార్థిౖె సేవించుచున్నాననని తాత్పర్యము,

మేరుచాపధరంధరారధమంబుధిషుధమాదిమా।
హరిశరాగ్నివిదగ్ధరాక్షసవాసభూతపురత్రయం।
రావణోగ్రతపోవిధానఫలప్రదానవిచక్షణం।
పార్వతీహృదయాబ్జభాస్కర మాశ్రయేఽహ మే
శ్వరం॥ 3

అ॥ మేరుచాపధరం। మేరువుపర్వతంబనెడు ధనస్సును ధరించువాడును, ధరారధం। భూమియె రధముగాగలవాడును, అంబుధిషుధం, అంబుధి। సముద్రము, ఇషుధిం। అమ్ములుపొదిగాగలవాడును, (బాణంబగునాదివిష్ణువు సముద్రమునందు పరుండువాడగుటచే సముద్రమమ్ములుపొదిగా వర్ణింపబడినది). ఆదిమం। మొట్టమొదటివాడును, హరిశరాగ్నివిదగ్ధరాక్షస వాసభూతపురత్రియం హరి। విష్ణురూపంబగు, శరాగ్ని। బాణాగ్నిహోత్రముచే, విదగ్ధ। తగలపెట్టబడిన స్వరూపనాశనమగునటులచేయబడిన, రాక్షస। తారకాసురునివు

తుౢలగు, కమలాక్ష|విద్యున్మాలితారకాక్షులకు, వాసభూత|నివాసస్థానమగు, పురత్రయం|మూడు పురములుగలవారును, (పైజెప్పిన ముగ్గురురాక్షసులును శివభక్తాగ్రేసరులనదగినవారు వారుతమతమ తపఃప్రభావము చేసి వానుగ్రహంబుబడసి ఇనుము బంగారు వెండితో చేయబడిన మూడుజంగమపత్తనంబులబొంది లోకులపైబడి హింసించుచుండిరి అత్తరివిష్ణుడు పాషండుడై నారదుని తనకుశిష్యునిగాజేసుకొని యీయసురులకును వీరియనుచరులకును నాస్తికమతమునుబోధించి శివునియందుభక్తి తొలిగించి శివద్వేషులగునటులజేసెను అందుకు శివుడాగ్రహించి అనన్యసాధ్య జలోపేతులగు నీత్రిపురాసురులను సంహరించుటకై నగరాజంబగు మేరువును ధనస్సుగాజేసి భూమియను రథంబుపైనెక్కి విష్ణురూపంబగు బాణమునుసంధించి రూపుమాయునటులజేసెనను పురాణగాధ సూచింపబడినది. రావణోగ్రతపోవిధాన ఫలప్రదానవిచక్షణం, రావణ|రావణునియొక్క, ఉగ్ర|అన్యదుష్కరంబగుటచే మహాతీవ్రంబగు, తపోవిధాన|తపశ్చరణమునకు, ఫలప్రదాన|ఫలమునిచ్చుటలో, వి

చక్షుణం। నేర్పుగలవాడును, అగుపరమేశ్వరునా శ్రయించుచున్నాను. శివభక్తుడగు రావణుడు పూర్వము మూడులోకములకు ప్రభువుగాగోరి తపంబాచరించి యెంతకును ప్రసన్నుడుగాకుండు టచే తానత్యంతఖిన్నమనస్కుడై పరమేశ్వరా నుగ్రహంబు బడయుటకై తనసమస్తకంబులనరకి కొని యగ్నిలో హోమముచేయనారంభించెను తొమ్మిదింటిని హోమముజేసి పదియవదానినరు కునుద్యుక్తుడై యుండ భగవంతుం డభిముఖుం డై వాని యభీష్టమగు త్రైలోక్యాధిపత్యము నొసంగెనను పురాణకథసూచింపబడినది తనకు ప్రతికూలముగానుండి లోకులబీడించువారి నెన్ని ప్రయత్నములనైనా జేసి యంతము నొందించువా డును తనభక్తుల యభీష్టముల నొసంగిగాపాడెడి వాడునునగు పార్వతీశునిసుఖార్థినై నేనాశ్రయిం చుచున్నానని భావము.

ఫాలనేత్రసముద్భవానలహేతిసాత్కృతమన్మథం।
ధారణార్ధనమస్తయోగనిదానభూతమరిందమం।
మానిమానస గోచరంసుఖదాయకం మఘవ
ప్రియం। పార్వతీహృదయాబ్జభాస్కర మాశ్ర
యే పరమేశ్వరం॥ ౮

ఆ॥ ఫాలనేత్రి సముత్థవానల హేతిసా త్కృతమన్మథం, ఫాలనేత్ర।ఫాలభాగంబునను న్న వహ్నిమయంబగు కంటిచేనుండి, సముత్థ।బ యలువెడలిన, అనల।అగ్నియొక్క, హేతిసా త్కృత।జ్వాలలకీయబడిన,మన్మథం।శృంగారరసా ధిదేవతయగు మన్మథునుగలవాడను, (పూర్వ ము తారకుండను నొకరాక్షసుఁడు తనబలగర్వ ములకు కొంత ఈశ్వరానుగ్రహము తోడ్పడ గ దృఢగర్వితుఁడై క్రిందుమీఁదుగానక వారుపీర నక యల్లరబీడించుచుండ నాబాధకు జడిసి బ్ర హ్మాదిసురులెల్లరు నిఃదుర్నికడకుజని యోచించి వానిని సంహరించుటకు తగినశౌనాని మహాతే జోబలయుతుండగు నీశ్వరునివల్లగలుగునని దల చి వీతరాగుండగు పరమతాపసోత్తముండునున గు నాపశుపతి వామగిరినధివసించి తపంబునల్పు చుఁడ తత్ప్రాంతంబుల చరించుగిరికన్యకను జూ చి యాతడుకామమోహితుం డగుఁటుల జేయు మని యింద్రునిచే ప్రేరితుఁడైమీనకేతనుండు తనసహాయములో గూడి యాయుద్యమము ననుండ నీశుండు తనకుగలిగిన చిత్తవికారమున కు కారణంబితడని జూచి వానినితన్ఫాలాగ్ని

జ్వాలచే రూపసూన్యునిగా జేసెనను గాధ సూచింపబడినది). కారణార్ధ సమస్తయోగ నిదాన భూతం, కారణార్ధ। చిత్తధారణయే ప్రయోజనము గాగల, సమస్తయోగ। సమస్తయోగములు, యమ। నియమ, ఆసన, ప్రాణాయామాద్యష్టవిధి యోగాభ్యాసములకు, నిదానభూతం। ఆదికారణమున్ను, (నిశ్చలంబగుమనంబున నాయనను పాసించుటకే యోగాభ్యాసమని తాత్పర్యము శత్రువుల నశింపజేయువాడును, మానిమానస గోచరం। వేదశాస్త్రార్ధతత్వము నెరింగిన మహామునులమానసమున విహరించువాడును, సుఖదాయకం। సుఖము నిచ్చువాడును, మఘువత్ప్రియం। ఇంద్రునికిప్రియమయినవాడును అగు పార్వతీపతిని నేనాశ్రయించుచున్నాను. జితేంద్రియుడును, మానిసంసేవ్యుడును, సమస్తయోగ ప్రధానుడును అగుపరమేశ్వరుని ధ్యానించితిని.

దేవదానవభీతికృద్విష పావకంగళదేశగం।
రాజజంబుఫలోపమం। కృతవంతమా శుభయాపహం। చంద్రశేఖరమతుసూత్రపినాకశోభి కరాంబుజం। పార్వతీ హృదయాబ్జభాస్కర మాశ్రయే పరమేశ్వరం॥ ౫

అ॥ దేవదానవభీతికృద్విషపావకం, దేవదానవ। దేవదానవులకును రాక్షసులకును, భీతికృత్। భయమునుబుట్టించెడి, విషపావకం।అగ్నివలెదాహకంబగు హాలాహలమనువిషమును, రాజజంబుఫలోపమం, రాజజంబుఫల। పెద్దజాతినేరడపండు పమః।సాటియగునటుల, గళదేశగం।గళకంఠదేశమును పొందియున్నదానినిగా, కృతవాంత।చేసినవాడై, అశు।శీఘ్రముగా, భయాపహం।వారిభయమునుపోగొట్టినవాడును, (పూర్వము అజరత్వామరత్వములను పొందుటకై అమృతమునొందగోరి సురాసురలు సముద్రమును మథించుచుండ ప్రథమము సకలలోకభీకరంబును అత్యుగ్రంబునునగు హాలాహలముదయించెను దానిజ్వాలలకోర్వలేక చెల్లాచెదరై సురాసురలు దిక్కెవ్వరును లేక శంకరునిమారుజొచ్చిరి ఆర్త్రి ఆర్తత్రాణపరాయణుండగు శివుడు గ్రంబగు నావిషయమును గ్రోలిమింగిన తనగర్భస్థమగు భువనమునకపాయము వాటిల్లునని దలచి తనకంఠదేశంబుననేయుంచి సురాసురులను గాపాడెను). చంద్రశేఖరం।చంద్రునితనమస్తకంబున నొకయలంకారమువలె ధరించినవాడును,

అక్షసూత్రపినాకశోభికరాంబుజం, అక్షసూత్ర। పరమతాపసోత్తముండగుటచేత బూనినజపమాలచేతను, పినాక।తనసమాధికి అంతరాయముచేయు దుష్టుల సాధించుటకై దాల్చినపినాకమను ఆయుధముచేతనున్న, శోభి।ప్రకాశించుచున్న, కరాంబుజం।పద్మములవంటి చేతులుగల, (అక్షమాలాపినాకములధరించిన పరమేశ్వరుని సుఖమునుగోరి యాశ్రయించుచున్నాను తానుబాధపడియైనను యొరులబాధలబాపుటకై యాత్తాత్రిణపరాయణవ్రతముగల చంద్రశేఖరమూర్తిని సుఖమునొందుటకై యాశ్రయించుచున్నానని తాత్పర్యము.

పాపకాననదావపావక మాధిపర్వతవజ్రిణం।
ధీవిధింకరుణామరందరసాలవాలమనోంబుజం,
భారతీపతిగీయమానకథాపదానసుధారసం।
పార్వతీ హృతయాంబుజభాస్కర మాశ్రయే పరమేశ్వరం॥ ౯

అ॥ పాపకాననదావపావకం, పాపకానన। పాపములనెడు యరణ్యమునకు, దావపావకం। కార్చిచ్చయియున్న వాడను, (తన్నాశించు పామరుల పాపరాసులనెల్ల కార్చిచ్చువిక్కిలిను

రథగాహంబను సరణ్యముసుదహించునటుల నె
క్కుడుంగు సంహరించువాడనియాశయము), ఆ
ధిపర్వతవజ్రిణం, అధి।మనోవ్యధల నెడు పర్వత
కొండలకు, వజ్రిణం।అకుంఠ. శక్తి యుతంబగు
వజ్రాయుధమును ధరించిన దేవేంద్రుడను, మ
నోవ్యధకన్న ఎక్కుడువ్యాధి లేదని పెద్దలు వక్కా
ణించెదరు, అయ్యవి యీమహానుభావునిగొల్చి
నచో నశించును. మరియు కొండలు పక్షులవలె
రెక్కలుగలిగి పత్తనములపైని గ్రామములపైని
బడి దేశోత్పాతములు గలిగించుచుండెను అప్పు
డింద్రుడు తన ఆయుధముల కేలబూని యచలం
బుల రెక్కలు తెగటార్చి లోకోపద్రవంబు మా
న్పెనను గాథ సూచింపబడినది). ధీనధిం।సద్బుద్ధికి
నిధానమైన వాడును కరుణామరందసాలవాలము
నోంబుజం,కరుణామరందరస।పూదేనియుంబోలి
న దయారసమునకు ఆలవాల।తావగెమనోంబు
జం పద్మమువంటిమనస్సుగలవాడును, పద్మంబె
టులసర్వదా మకరందరస భరితంబైయుండునో
యటులనే మహానుభావుని డెందము జీవులయెడ
దయారసముతో నిండయున్న వాడని భావము.
భారతీపతిగీయమాన కథాపవాగ సుధారసం,

భారతీపతివాగధిదేవతయగు భారతికివల్లభుండైన చతుర్ముఖునిచే గియ్యమాన।గానముచేయబడుచున్న, కథా।కథారూపమగు, అపదాన।తనచేచేయబడినకార్యములనెడు, సుధారస।అమృతరసముగలవాఁడు, (చతుర్ముఖుండగుబ్రహ్మ ఈతని పూర్వకార్యములనెల్ల రసవంతమునగు నొకకథగా గూర్చి యమృతమువలె రుచ్యంబగుటచే తన నాల్గుమోములతో నెల్లప్పుడు గానముచేయునని భావము). పరమేశ్వరం।ఈశ్వరుని, ఆశ్రయే।ఆశ్రయించుచున్నాను, దురితనాశకుండును భూతదయాళుండును శుశ్లోకుండును నగుశంకరుని సుఖార్థినై గొల్చుచున్నానని తాత్పర్యము॥

సుప్రతిష్ఠితలింగరూపధరంసురేశ్వరపూజితం।
అభిషేచనకృద్విచతుణభక్తశీఘ్రఫలప్రదం।
గ్రంథిభేదకృతిఙ్నృణాంశివమీశ్వరం। తమనఃపరం। పార్వతీహృదయాబ్జభాస్కరమాశ్రయే పరమేశ్వరం॥ ౭

అ॥ సుప్రతిష్ఠితలింగరూపధరం, సుప్రతిష్ఠిత। ఉపాసకులచే తమమనంబునయెదుటనుండ భగవదాకృతియందు లీనమగుటకై కల్పింపబడిన, లింగరూప।లింగాకారమును, ధరం।ధరించినవా

డును, సురేశ్వరపూజితం। దేవతాశ్రేష్ఠులుచే సే
వింపబడువాడును, అభిషేచనకృద్విచక్షణభక్త శ్రే
ష్ఠఫలప్రదం, అభిషేచనకృత్ ।తనకభిషేకము
నొనర్చెడి, విచక్షణా।యుక్తాయుక్త వివేచకులగు
భక్త।భక్తులకు, శ్రేష్ఠ ఫలప్రదం।వారేష్టమును
గోరి తనకభిషేకముగావించుచున్నారో వారికా
ఫలమును వేగముగాదయచేయువాడును, నృ
ణాం।పామరులగునరులకు, గ్రంధిభేదకృతం।సం
సారగ్రంథియొక్క భేదనమును చేయువాడును, (త
న్నుగొల్చెడిపామరు లీసంసారములో బడుచుండె
డి యిక్కట్టులబాపివారికి జన్మరాహిత్యము నొ
సంగువాడని భావము). శివం।అమంగళమగుఆకా
రముచేనొప్పినను శుభప్రదమైనవాడు, ఈశ్వరం
అణిమాద్యష్టైశ్వర్యములతో కూడుకున్నవాడగు
టచే యనన్యవాచ్యమగు నీశ్వరపదముచే పిలువ
దగినవాడును, తమసఃపరం।అజ్ఞానమునకు పైవా
డును శ్రవణమననాదులచే తమయజ్ఞానమును
బారద్రోలి కేవలశుద్ధతత్వచైతన్యముగల మహా
నుభావులకే తెలిసికొనుటకు శక్యమైనవాడునన
గు పరమేశ్వరుని నాశ్రయించుచున్నాను, (ఉ
పాసకుల కుపయుక్తమగు కల్పితలింగాకారమున

నుండి వారిచేయభిషిక్తుఁడై వాఁడినిర్మలమగు మ
నంబునకు గోచరుఁడై సంసారబంధమును విద
ల్చెడి శంకరుని సుఖముసుగోరి యాశ్రయించు
చున్నానని తాత్పర్యము).

తాపసాభయదాయకంతపసామనంత ఫలప్రదం।
నందికేశ్వరవిఘ్ననాయకహనచామరప్రజితం।
పాండవప్రియమాదిదేవమనఘశంకరుణాలయం।
పార్వతీహృదయాబ్జభాస్కరమాశ్రయే పర
మేశ్వరం॥ ౮

అ॥ తాపసాభయదాయకం, తాపసత్రయత
మయాశ్రమములలోనుండి తపంబాచరించెడు
మునీంద్రులకు, అభదాయకం।తపోవిఘ్నముచే
యు దురాత్ములనుండి బాధలు లేకుండునటుల
శరణుయిచ్చువాఁడును (పిదప) తాపసాం।వారలో
నర్పెడితపంబులకు, అనంత।యెన్నటికి నాశనము
లేనివిస్తారమగు, ఫల।కైవల్యపత్రప్రాప్తిరూపఫల
మును, ప్రదం।ఇచ్చువాఁడు, (సాధరణముగా లౌకి
కఫలములన్నియు కొంతవ్యవధిగల్గించి త్వర్లో
పభోగ్యములగుటచే వానికిఅంతము సంభవించు
నుగాని యీఫలమలౌకికమగుటచే నిరవధికము
యి సుఖాత్మకమై శాశ్వతముగానుండుననిభావ

ము). నంది కేశ్వరవిఘ్ననాయక హస్తచామర వీజితం, నంది కేశ్వర। నంది కేశ్వరునిచేతను, విఘ్ననాయక। విఘ్నేశ్వరునిచేతను, హస్తచామర। కేలధరించిన వింజామరలచే, వీజితం। విసరబడిన వాడును, పాండవప్రియం। పాండు పుత్రులగు ధర్మరాజాదులకు మిక్కిలిప్రియుడును, (అర్జునుడు శత్రుజయార్థమై సాధనసంపత్తునుగోరి కామ్యక వనములో తపంబాచరించుతరి శివుండు కిరాతాకృతితో బ్రత్యక్షమై యచటవానితో గొంతతడవుబోరి వానిబలసాహసముల కచ్చెరువంది తన నిజరూపమునుజూపి వానికి పాశుపతాద్యస్త్రముల నొసంగెననుగాథ సూచింపబడినది), ఆదిదేవం దేవులలో మొదటివాడును అనక్షరం। నిందార్హమైన యక్షరములులేనివాడును పరమపవిత్రము గు చరిత్రగలవాడును) కరుణాలయం। దయకు నివాసస్థానమగు ఈశ్వరుని శేవించుచున్నాను, తపోవిఘ్నములబాపి తాపసులకు ఫలంబొసంగుచు నంది కేశ్వర విఘ్ననాయకు లుభయపార్శ్వముల చామరమ్ములువీవ భక్తాభీప్సితప్రదుండగు శంకరుని శుభంబుగోరి యాశ్రయించుచున్నానని తాత్పర్యము,

ద్వీపిచర్మకృతాంబరంత్రిదివేంద్రబృందసుసేవితం
శైలరాజసుతాసమంచితవామభాగమనోహరం।
గాంగపూరపవిత్రితాఖిలలోకజాలమఘాపహం।
పార్వతీహృదయాబ్జభాస్కర మాశ్రయె పర
మేశ్వరం॥ ౬

అ॥ ద్వీపిచర్మకృతాంబరం, ద్వీపిచర్మ।పెద్ద పులిచర్మముచే, కృతాంబరం।చేయబడినబట్టగల వాడును, (పెద్దపులిచర్మముమాత్రమే బట్టవలె పృష్టభాగంబున ధరించుచున్నాడని భావము). త్రిదివేంద్రబృందసుసేవితం, త్రిదివేంద్రబృంద। దేవతాసముదాయముచే, సుసేవితం।బాగుగాసే వింపబడినవాడును, (ఇంద్రుడు మొదలగు సురలందరు నీతనిసణకువతో గొల్చుచున్నారనిభావము). శైలరాజసుతాసమంచితవామభాగమనో హారం, శైలరాజ।సమస్తపర్వతములకు, రాజన నొప్పుహిమవంతునియొక్క, సుతా।కూతరగుపా ర్వతీదేవిచే, సనుంచిత।ఒప్పుచుండెడి, వామభా గ।ఎడమభాగముగాగలవాడగుటచే, మనోహా రం।రమణీయముగానున్నవాడును, (ఈశ్వరుండర్ధనారీశ్వరుండగుటను దక్షిణభాగము ఈశ్వర రూపమును వామభాగము పార్వతిరూపముగాను

న్నదని యాశయము, అందుచేత స్త్రీపుంవ్యక్తి కేశాకృతిగల్గి అతిమనోహరముగానున్నదని భావము) గాంగపూరపవిత్రితాఖిలలోకజాలం, గాంగపూర।గంగానదియొక్క-ప్రవాహముచే, పవిత్రిత।పావనమైయొనర్పబడిన, అఖిల।సమస్తమైన, లోకజాలం।లోకముల సముదాయముగలవాడు, (భగీరథుడు తనపితామహులను సద్గతినొందుటకై గంగనుదెచ్చుతరి ఈశ్వరుడు భగీరథప్రార్థితుడై తనశిరంబున గంగానదీపాతమునకంగీకరించి మరల యా గంగనువిడువ నామందాకిని మూడులోకములయందు ననర్గళముగా వ్యాపించి యందరిప్రజలనెల్ల స్నానపానాదులచే పరమపావనులగునటుల జేయుచున్నది, దానికంతకు ప్రధానకారణుండీతడని యాశయము). అఘాపహం।తన్ను సేవించెడివారి పాపములెల్ల బాపువాడును నగుశంకరుని సుఖమునపేక్షించియాశ్రయించుచున్నాను. వ్యాఘ్రాజినమునుపృష్ఠభాగమునదాల్చి దేవతులచే గొల్వబడెడు యర్ధనారీశ్వరుడు తొల్లిగంగను ప్రవహింపజేసి ముల్లోకముల దురితములబాపినటుల నాదురితముల బాపి సుఖవంతునిగా జేయుగాతయని యాశ్ర

యించుచున్నాడని తాత్పర్యము.

చంద్రభాస్కరవహ్నిలోచన మష్టమూర్తి మనంతకం। మానిమానసభర్మహర్మ్యని వాసతత్పరమవ్యయం। నారదాది మునీంద్రబృంద సమర్చితాంఘ్రిసరోరుహం। పార్వతీహృదయాబ్జ భాస్కరమాశ్రయేపరమేశ్వరం॥ ౧౨

అ॥ చంద్రభాస్కరవహ్నిలోచనం, చంద్ర॥ చంద్రుడున్ను, భాస్కర।సూర్యుడున్ను, వహ్ని। అగ్నియు, లోచనం।నేత్రస్థానము గలవానిని, (త్రిలోచనుండగు నీశ్వరుకి వామదక్షిణ నేత్రములు రెండును సూర్యచంద్రులనియు ఫాలభాగంబుననున్న నేత్రమగ్నియనియు ప్రతీతిగలదు). అష్టమూర్తిం।యెనిమిది యాకారములుగలవాడును, భూమి, నీరు, గాలి, అగ్ని, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, యజమానుడును, శ్రుతి సమ్మతమగు భగవంతునియొక్క యెనిమిదిరూపములై యున్నవి). అనంతకం।మృత్యుంజయుడగుటచే. యెన్నటికి నంతములేనివాడును, మానిమానసభర్మహర్మ్యనివాసతత్పరం, మాని। మునులయొక్క మానస।మనంబనెడు, భర్మహర్మ్య।సువర్ణమయమైన భవనములయందు, ముదలయొ

క్కడెంత గతి జాగరూకతతో కామాదివికా
రా సపహార్యంబగునటుల కాపాడఁబడునను నం
శమును సూచించుటకై సువర్ణభవనముగా రూ
పించబడినది, నివాసతత్పరం।నివశించుటయందు
ఆశక్తిగలవాఁడును, మునులయొక్క మనంబు లతి
నిర్మలంబులై వారి యధికారమునకు లోబడి
యుండుటచే భగవంతుడెప్పుడు వారిహృదయ
ములలో నివశించుననిభావము. అద్వయం।తన
కుసరియగు రెండవవస్తువులేనివాఁడును, నారదా
దిమునీంద్రబృంద సమర్చితాంఘ్రి సరోరుహం,
నారదాది।నారదుడు మొదలగు, మునీంద్రబృం
దం।మునిశ్రేష్టులయొక్క సమూహముచే, సమ
ర్చిత।పూజింపబడిన అంఘ్రిసరోరుహంపాదప
ద్మములుగలవాడును, నారదాదిదేవర్షి వర్యులె
ల్లరు భక్తిపరవశమునొంది యేకముగా నీపరమే
శునిపాదముల బూజించెదరని భావము). పరమే
శ్వరం।పరమేశ్వరుని, ఆశ్రయే।శరణగా నాశ్రి
యించుచున్నాను, తేజమయనేత్రుండగు అష్ట
మూర్తియునై హానివర్యుల మానససీమను వి

హరించు దేవర్షిసఃసేవ్యుండగు పరమేశ్వరు నా
శ్రయించుచున్నానని భావము).



శ్లో॥ శివాష్టక మిదంపుణ్యం విద్వాన్మానసగోచ
రం।యఃపఠేత్సతతం భక్త్యాశివసాయుజ్య మా
ప్నుయాత్ ॥

